సంపుటము 3] జూలై 1916 [సంచిక 1

# బాలమిత్ర





కీడువల్ల జయింపబడక
మేలువల్ల కీడును జయించుము

ఒకయూరిలో రెండు గొప్ప కుటుంబములుండెను. వారు భాగ్యవంతులైనను బద్ధవైరము గలిగియుండిరి. సుదర్శనుడను మొదటివాని కొక్క ముద్దుబిడ్డ యుండె. తల్లిదండ్రు లా బిడ్డను అతి గారాబమున బెంచుచు "హేమలత"

యను పేరిడిరి. బంగారుతీగె యను పేరబరగుచున్న యీ బాలిక చిన్నతనమునుండియు భయభక్తులతో పెంచబడు చుండెను. సాధ్వియగు యామెతల్లి, త్వరలోనే పరలోకమున కేగెను. కావున తండ్రిగారే యామెను జూచుకొను చుండిరి. పురుషోత్తముడను రెండవవాడతి క్రూరుడై తన పగసాధించగల సాధనమును వెదకుచుండెను. అది యట్లుండ, పదియేండ్ల ప్రాయపు హేమలత చెంతనున్న మామిడితోపులో నాడుకొనబోయెను. పురుషోత్తముం డది కనుంగొని, వాడి ఖడ్గము చేబూని, పరుగున యా బిడ్డంజేరి, యామె మృదు హస్తముల రెంటిని కఠినచిత్తుడై నరికివేసి "ఇప్పటికి గదా మీ తండ్రియింటిపై నాకుగల కక్షదీర్చుకొంటిని" అనెను. కన్నీరు కాల్వలై, రక్తము ప్రవాహమై ప్రవహించ, బాధ కోర్వజాలక గొల్లున నేడ్చుచు యా బాల యిల్లుచేరె. జనకుడామె యవస్థం గని గాయము మాన్పింపదగు ప్రయత్నంబుల గావించి, సకలోపచారంబుల డానేచేయుచు, మొండిచేతులబిడ్డను జూచినప్పుడెల్ల గలుగు దుఃఖంబుచే కృశింప నారంభించె.

కొన్ని సంవత్సరములు గతించిపోయెను. ఒక రాజకుమారుడా యూరు దర్శింపబోయెను. వార్తలన్నియు తెలిసికొన్నపిమ్మట సుదర్శనుని యనుమతిని మన హేమలతను

పెండ్లియాడి, యామె సుగుణ సంపత్తికిని సౌందర్యమునకును అచ్చెరువొందుచు, తన పట్టణమునకేగి, యామె నొక సౌధమున జేర్చి, వివిధోపచారముల జేయుట కనేక సేవకుల నియమించి, యతిప్రేమతో జూచుకొనుచుండెను. మిగుల భాగ్యవంతులగుటం జేసి, ధర్మకార్యములచే తమ కీర్తిని నానా దిక్కుల వ్యాపింపజేసిరి. మార్గాయాసముచే నలసిసొలసి యుండువారిని, దిక్కులేనివారిని, పేదలను, అంగహీనులను, వస్త్రహీనులను తమ యజమానురాలి యాజ్ఞచే నిరువురు సేవకు లెల్లప్పుడును సౌధమునకు గొనివచ్చి సకలోపచారముల జేయుచుందురు. అన్నవస్త్రముల నుచితముగా నిచ్చి, ద్రవ్యసహాయంబుగూడ జేయుచుండిన యా సుగుణవతి నందరు ప్రేమించుచు కొనియాడుచుందురు. ఆమె తండ్రి గారును అతివృద్ధుడై యుండినను, ధన్యురాలైన తన బిడ్డం జూచుకొని యానందించుచు, నెమ్మదితో ప్రాణము విడచెను.

హేమలత దినకృత్యముల జేయించుచున్న సమయమున నతివృద్ధుడగు నొక బాటసారి, చింపిగుడ్డలు తన దేహముపై కొద్దిగా నుండ, ఒకరి చర్మము యెముకలనంట, తొట్రుపడుచు, యతికష్టముతో యామె పంచజేరి యొకటిచే స్మారకముతప్పి నేలం మూర్ఛిల్లెను. కడుదారిద్ర్య హృదయయగు యా సతీలలామ, యా ముసలివాని యవస్థం గనుం

గొని, చింతించి, తగు యుపచారములచే నాతనికి స్మారకము రప్పించి, తేలిక యాహారంబును తానే స్వయముగా సిద్ధముచేయించి యాతనికి కొద్దికొద్దిగా ద్రాగించి, బలపరచి, స్నానంబుగావించి, పట్టువస్త్రముల గట్టబెట్టి, హంసతూలికా తల్పముపై బరుండబెట్టించె. రాజసుఖముల ననుభవింపుచున్న యా వృద్ధుడు, హేమలత, తన్నుద్ధరింపవచ్చిన దేవదూతయని భావింపుచు, ననేకవిధముల తన కృతజ్ఞత గనుపరచుచుండెను. ప్రతిదినమును ప్రేమతోడను పరామర్శించుచున్న కమలాక్షి యొక్క కరము విరువబడియుండు సంగతి నాతడు కనుగొనకుండెను. ఏలయన ఆమె బాహువులెల్లప్పుడు వెనుకనుంచబడి యుండునవి, లేదా ముసుకున దాగియుండునవి. ఒకనాడతడమితానందములోనున్న తఱిని యామె అతనిం జేరి, పంచభక్ష్య పరమాన్నముల నాతడు యారగించినవెనుక, పరిమళ పన్నీరాతనిపై జల్లబడిన పిదప, "ఇప్పటికిగదా నీకు నాకున్నపగ సాధించుకొంటిని" అని తన రెండు మొండికరముల నాతని కగుపరచెను. తత్క్షణమే యతడు మూర్ఛితుడై, మతిదెలిసినవెనుక పిచ్చివానివలె నేమియు దోచక నిలుచుండె. అతని వృద్ధనేత్రముల నుండి నీరుగారుచుండెను. ఆమె కాళ్లపైబడి క్షమాపణ వేడగోరెగాని ఆమె వారించి, తన తండ్రి చనిపోయెననియు,

పురుషోత్తముడే తన తండ్రిగానుండి భార్యాభర్త లిరువురిని గాపాడవలెననియు చెప్పి, యతని ధైర్యపరచి తన ప్రియ భర్తం జేరి యీ వృత్తాంతమంతయు నెరింగించి, యతని గౌరవముతో గాపాడునట్లొడబరచి యప్పటినుండి యతని మిగుల ప్రీతి గౌరవములతో జూచుచుండె. ఆమె కరముల నరకివేచిన తక్షణమే పరదేశములకు పరుగెత్తిపోయిన యితడెన్నెన్నియో కష్టములబడి, తిన కూడును, కట్ట బట్టయులేక, కడుదీనుడై చిట్టచివర కెట్లు బ్రతికించబడెనో చూచితిరా? ఆమె యతని తలపై నిప్పులకుప్ప పోసినట్లాయెనుగదా? కావున మన ప్రభువగు క్రీస్తు చెప్పియుండిన ప్రకారమెప్పుడును శత్రువుల మన్నించ సిద్ధముగనుండి, వారికి మేలుచేయుచు, వారికొరకు ప్రార్థించుచు, "కీడువల్ల జయింపబడక, మేలువల్ల కీడును జయింతము."

---

# యుక్తిగల వెర్రిగొల్లవాడు

ఒకానొక దేశమందొక గొల్లవాడు వాసము చేయుచుండెను. వాని నామధేయము, చెవల కన్నయ్య. ఇతడంత జ్ఞానముగలవాడు కాకపోయినను చాలా యుక్తిగలవాడు. ఇతడు చాలా సౌందర్యముగల చిన్నవాడై

యుండెను. ఇతడు దినదినము అడవులకు తమ మేకల మందను మేపుటకై తోలుకొని పోవుచుండెను. ఆ దేశపు రాజుగారి



కొక చక్కని మేలైన గొఱ్ఱెపొటేలు గలదు. దాని నెట్లు యిన యుపహరింపవలెనని తన మిత్రులతో యాలోచించుచునే యుండెను.

ఒకానొక తరుణమందది ప్రయాణమై పోవుచుండ దాని నతని మిత్రులతో గలిసి జంప నుద్దేశించి, దానిని గదియబట్టి వధించెను. ఈ కన్నయ్య యెల్లప్పుడు స్నేహితుల యొక్క మాటలందు మాత్రము లక్ష్యముంచేవాడు. గాని తక్కిన వారిమీద గురియుంచేవాడు కాడు. అంతటా దేశపు రాజు తన గొఱ్ఱెపొటేలును పారజూచిన కంటికి గోచరము

కాదు. ఆ రేడు మనస్సునం దతిచింతనుంచినవాడై ఎవరు, యేవిధమైన హాని నా గొఱ్ఱెపాటేలుకు జేసియుంటిరో? తెలియనిచ్చినచో వానికి బహుమతియును, అట్లు చేసినవానికి ఉరియనెడి శిక్షయు గలుగునని చాటించెను. అంత నా గొల్లవానిమిత్రు డొకడొచ్చి రాజున కాసంగతి విశద పర్చెను. భూపతి నతనికి బహుమాన మొసంగి, యా గొల్ల వానిమీద కోపము, తాపము బూని మండిపడి, వానిని తప్పక ఉరితీయవలెనని గవర్నమెంటువారి కప్పగించెను. వారతని కొక సమన్ బంపెను. అతడా సమన్ జూచి భయాక్రాంతుడై నేనెట్టి గండమునుండి విడిపించుకొన గలనని ప్రయత్నించు చుండ తన కొక యాలోచన గలిగెను. ఈ చెవల కన్నయ్యా యారాజు గొఱ్ఱెను చంపినపు డొక ప్లీడరు వానిలో బాలు పొందెను. గనుక ఇపుడు ఆప్లీడరు కడకేగిన నన్ను తప్పక నిందునుంచి తప్పించగలడని నిరీక్షణతో తనలో దానకొని లేచి వెళ్లి యాయనతో విలపించెను.

"నీరు చెఱువునిండా నిండియున్నప్పుడే కప్పలు విస్త రించునన్నట్లుగా" యాప్లీడరు మిత్రు నిలాగున జూడక శత్రుని వలె భావించి రెండువందల రూపాయలు యిచ్చిన నీకు సహాయ పడెదనని చెప్పెను. ఆ వెర్రి గొల్ల, "తాను త్రవ్వ కొన్న గోతిలో తానే పడినట్లుగా" విచారించి ఇపు డొక

వందరూపాయలు యిస్తాను. ఈ కేసు గెలిచిన మిగత వంద రూపాయలు తరువాత యిస్తానని వాగ్దానము చేసికొనెను.

ఈ కేసు యీరింగు యగుచుండగ యాప్లీడరు గొల్ల వానితో మేస్ట్రిడ్ గారు ఏమి యడిగినను మీ మేకలరచినట్లుగా మే! మే!! మే!!! యని కేకవేయుమని చెప్పెను. అంత మేస్ట్రిడ్ గారు సింహాసనముమీద గూర్చుండియుండ వారికెదు టప్లీడరుండి ఈ గొల్లవాడు రాజుగారి గొర్రెపొటేలును జంపినమాట వాస్తవమే, గాని వాడు వెర్రిగొల్లవాడు. గను కతనికి శిక్షను విధించుట మేలుకాదు యని చెప్పసాగెను. అప్పుడు వారు యాగొల్లవాని రమ్మని చెప్పగ వాడొచ్చి మే! మే!! మే!!! అని యరచెను. ఆమీదట కేసు కొట్టివేయబడెను. ఆగొల్ల ముఖారవిందముతో నిండినవాడై మిగులసంతసించెను.

వాని స్నేహితుడై యాప్లీడరు తనకు రావలసిన వందరూపా యలు, రాబట్టుకొనవలెనని ప్రయత్నించి యపుడే ఓరి గొల్ల! కేసు కొట్టివేయబడెను. గనుక నీవు నాకియ్యవలసిన వంద రూ పాయలు యిమ్మని యడిగెను. అంత నాగొల్ల యుక్తిగలవాడు గనుక మే! మే!! మే!!! యని యనెను. ఇంకనవద్దుగాని నాకియ్యా వలసిన సొమ్ముమాట చెప్పుమని బ్రతిమాలుచుండ ప్రతిమాటకు మే! మే!! మే!!! యని యంటూనే యుండెను. ఆఖరునకు వాని యొద్దనుంచి యా వందరూపాయలు తీసుకొన లేకపోయెను.

# పేరాశ

ఒకనాటి ప్రాతఃకాలమున నొక వేటకాడు మృగయార్థమై బయలువెడలెను. వాడు చాలాదూరము పోకమునుపే ఒక కుందేలు మార్గమున నడ్డుపడ దానిని తన విల్లుతో కొట్టి సంచిలో వేసుకొని యీవిధముగ నాలోచించెను. «అరే! ఏమి? ఇంత సమీపములోనే నే నొక షికారు సంపాదింప గలిగితి. ఇక ముందుకుసాగినయెడల మరెక్కువ షికారు చేయగలుగుదును.» అని సాగిపోయెను. అంతలో నొక యడవిపంది యెదురుపడెను. వాడు దానినికూడ చంప నుద్దేశించి వింటిబాణముతో కొట్ట నది దెబ్బతిని మిగుల కోపముతో రేగినదై మరియొకబాణమును వేయునంతలో వాని పైబడిచంపి కడకు అదియు జచ్చెను. పిమ్మట ఒక నక్క ఈ మూడు చచ్చి పడియుండుట చూచి తలంచిన దేమనగా «భుజించుటకు ఇవి అతి శ్రేష్ఠములైన పదార్థములు. నాకుగల ఆకలిని నివారించుటకై కొంచెముమాత్రము తినిన పక్షమున యావత్తు చెడిపోవుననుకొని, «సమీపమునందు పడియున్న విల్లనంబువంక జూచి దాని భుజించినమాత్రాన ఆకలి తీరుననుకొని యా వింటినరమును తటాలున కొరికెను, తత్క్షణమే వింటికినున్న బాణము ఎగిరి నక్కకు తగిలినందువల్ల నా పేరాశగలజంతువు మృత్యుదేవతపాలాయెను.

«అత్యాశ అన్నివిధములచేటు» అధిక ఆశగలవారమై యుండక కలిగినదానితో తృప్తినొంది సంతసించుటే శ్రేయస్కరము.



# ఒక చిన్నకుమారునియొక్క గొప్ప ప్రేమ



ఒక నగరమున ఒక విధవ ఉండెను. ఆమె మగడు కాలము చేసినవెనుక జరుగు బాటులేక ఆమెయును ఆమె కుమారుడును పడ్డకష్టము ఇంతంత కాదు. దారిద్ర్యమే కారణముగా ఆమెకు వ్యాధియు దుర్బలమును అధిక

మాయెను. ఆమె కొన్ని రోజులు మంచమెక్కి ఉండవలసి వచ్చెను. ఆమె కుమారుడు చిన్నవాడు గనుక ఏమిచేయుటకు వానికి శక్తిలేదు. పాపము వాడు అనేక వైద్యుల ఇండ్లకు పోయి తన తల్లికి వైద్యము చేయుటకు రావలెనని ప్రార్థించెను. కాని ఎవడును రానొల్లకపోయిరి. వాడు వారి పాదముల పైబడి నమస్కరించి తనవల్ల నయినంతవరకు బ్రతిమాలుకొనినను ఆ పాపులు కొంచెమైనను కనికరపడలేదు. తరువాత ఆ బాలుడు దారిలో ఏడ్చుచు పోవుచుండగా ఒక చిన్నబండిఎక్కి వచ్చుచుండిన ఒకరు కనబడిరి అంతట వాడు అతనియొద్దకుపోయి రోగియైయున్న తల్లికి వైద్యసహాయము చేయవలెనని ప్రార్థించెను. కన్నతల్లికై పాటుపడు కష్టమును చూచి అతనికి కనికరము కలిగెను. అతడు అబ్బాయీ నేను నీ తల్లికి వైద్యము చేసెదను రమ్ముఅని వానిని తన బండిలో ఎక్కించుకొని వానిఇంటికి పోయెను. అతడు లోపలికిపోయి ఆవిధవ ఆకలి కోర్వలేక కన్నులు తేలవేసి చెవులు వినరాక శోకించి ఉండుటచూచి ఆమెకు పేదరికము తప్ప వేరు వ్యాధిలేదని తెలిసికొనెను. పిల్లవానిచూచి అతడు నీ తల్లి రోగమునకు తగిన ఔషధములు వ్రాసిఇచ్చెదను. కాగితము కలము సిరాబుడ్డిని తీసికొనిరా అనెను. పిమ్మట అతడు, ఆ బాలునికి నూరువరహాలు ఇవ్వవలెనని తన ఖజానాదారునికి

ఒక చీటి వ్రాసిఇచ్చెను. బాలుడు ఆ చీటిపైని విలాసమును విచారించి చీటి ఇచ్చినవారు తమ రాజ్యమునేలు చక్రవర్తి అని తెలిసికొనెను పిమ్మట ఖజానాదారువద్దకు వెళ్లి చీటిలోని మొత్తమును పుచ్చుకొని ఇంటికిరాగానే వారికి దారిద్ర్యము అనెడివ్యాధి హతమై పోయెను. ఆపిమ్మట ఆచక్రవర్తిగారి ఉపకారమును వారిద్దరును ఎల్లప్పుడును తలంచుకొనుచు కొన్ని రోజులు సుఖముగా ఉండిరి గనుక కష్టపడినవానికి తప్పక ఫలము దొరకును.

---

## బైబిలు పిల్లలు

### (మోషే బాల్యము)

మాసము దాటుకొలది బిడ్డడు బహు అందగాడగు చుండెను. ఫరోకొమరిక పుష్టిగల ఆసుందర బాలుని చూచుకొని, అతిశయపడుచుండెడిది. నీటిసమీపమున జమ్ము పెట్టెలో నుంచబడిన బాలుడుగాన మోషేయనుపేరు ఆమె వానికిపెట్టెను. మాసముదాటి రెండు సంవత్సరముల బాలుడాయెను. ముచ్చట మాటలాడుచు, ఫరో కొమార్తెను అమ్మాయని మాటిమాటికి పిలుచుచూ ముచ్చటగా తిరుగుచుండ, చూచు రాచపుత్రికను అధిక ఆనంద

ముగ నుండునది. తోటవారులు, గొడ్డండ్లు చేతపూని పనికై పోవుచున్న పనివారు, పొలములలో పనిచేయపోవు స్త్రీలు మొదలగువారు, ఈ పిల్లవాని మార్గమున చూచుట తటస్థించెనా నోరు తెరచుకొని ఆశ్చర్యముతో చూచువారట. అతి సుందరుడగుటచే అందరు వీని అపేక్షతో చూచువారు. ఇట్లు ఈ బాలుడు ఫరోనగరమున పెంచబడుచుండెను. బాలునకు పాలిచ్చుదాది, దైవజనురాలగుటచే బిడ్డకు హితబోధలు చెప్పుచు, దైవమును గురించి నేర్పుచుండినది. ఆ కాలమున ఫరోకఠినుడై ఇబ్రీయులుపెట్టు కష్టముల వివరించునది. ఈ బిడ్డ పెద్దవాడైన ఫరోకుపిమ్మట రాజ్యము చేయవలసి వచ్చునుగాన ప్రజల ప్రేమతో పాలించవలెననియు, వారికిగల పలువిధశ్రమల నివారించవలెననియు ఈ రీతిగా ఆమె ఆబిడ్డకును చిన్నతనముననే మనమున బాగుగా నాటునటుల బోధ జేసెను. కాన మోషే ఐగుప్తీయులకంటే, అచ్చట కాపురమున్న దౌర్భాగ్యులై వెతల పాలుపడిన ఇబ్రీయులపై ప్రేమగా యుండువాడు. ఒకనాడు విహారార్థమై తిరుగుచుండ నొక ఐగుప్తీయుడొక ఇబ్రీయునితో పోట్లాడుట మోషేచూచి, తత్కాలమునకు వచ్చిన కోపరోషముల పట్టజాలక, ఐగుప్తీయుని చంపి యిసుకలో పూడ్చిపెట్టెను. ఈ సంగతి ఎవరికి తెలియనందున, తెలియని ఫరోయింట బాగుగానే వర్తించు

చుండెను. ఫరోకుమార్తె తన తండ్రికిపిదప రాజ్యమునకు వచ్చువాడైనందున మోషేకు సకల విద్యల నేర్పించెను. మోషే గొప్ప ప్రవీణుడాయెను. ఇట్లుండ ఒకదినమున ఇరువురు ఇబ్రీయు లెద్దియోకారణంబున పోట్లాడుచుండ వారి సమీపించి "సోదరులారా! సోదర ప్రేమవీడి ఎందులకిట్టు కలహించుచున్నారు? ఇది మీకుతగదు. సమాధానముగా నుండుడు" అని వారిని హెచ్చరించగా వారిలో నొకడు "చాలునీబోధ మొన్న వానిచంపి పూడ్చిపెట్టి, నేడు ఏమో మంచివాడవుగా బుద్ధిచెప్పుచున్నావే" అని అనగానే మోషేకు మనమున గలిగిన భయమునకు మితిలేదు. ఫరోసంగతి తెలిసికొన్న తప్పక శిక్షించునని యెరిగి ఎవరికి చెప్పకుండా ఐగుప్తునుండి అరణ్యమునకు చాలాదూరము పారిపోయి యచ్చట ఒకరి పరిచయము కుదుర్చుకొని జీవించుచుండెను.

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

ఓ బాలమిత్రను చదువు బాలికా బాలులారా నేను యీ బాలమిత్ర చదువుటవలన నేను సంతోషానంద భరితుడనై దేవునిప్రేమను ఆయనయొక్క మహి

మను వివరించుటకు సదుపాయముగా యుండగలందులకు ఈ సంగతి మీకు వివరముగా తెలియజేయుచున్నాను. ఏదనగా బెజవాడలో యున్న మేమందరము (దేవునిచిత్తము




నెరవేర్పుటఎట్లు) దానికిగల పనులవిషయము మేము 1915 సం॥ అక్టోబరులో కొంతమందిమి కలసి విచారించగా కొన్ని ఆలోచనలు పుట్టినవి. అప్పటినుండి ప్రతి శుక్రవారం సాయింత్రము 7 గం. మొదలుకొని 9 గంటల వరకు ప్రసంగములతోడను, కంఠత వచనములు ఒప్పగించుటయు, ప్రార్థనలవల్ల మనమనవులు అంగీకరింపబడునని ఎక్కువ శ్రద్ధా

భయభక్తులతో దీనిని జరుపుచూ యున్నాము. ఈ మీటింగు పేరు (పిల్లల సమాజము.) అను పేరు పెట్టితిమి. అందుగల సెక్రెటేరీలు వారు తాము, తాము చేయుపనులు ఏవనగా:— భక్తివిషయము నేర్పువారును, ప్రార్థన జరుపువారును, అన్యులను బోధవల్ల మళ్లించువారును, వచనము కంఠత పుచ్చుకొనువారును, ఈ ప్రకారము జరుపుచూయున్నాము. దీని విషయము జనరల్ సెక్రెటేరీ గారైన ఎం. పి. తామస్ గారివల్ల వృద్ధిపొందుచూ యున్నది. 1916 సం-2-5-తా॥ సాయంకాలము 5 గం. మొదలు 8 గంటల వరకు చాలా గంభీరమైన ప్రార్థనకూటము జరిపితిమి. ఆకూటమునకు, మిషనెరీలును, గురువులును, బాలికాపాఠశాల పిల్లలును బోర్డింగు మొగపిల్లలును యింకా చాలామంది క్రైస్తవులును హాజరైరి. మా మిషనెరీ గారైన ఫీచీదొరగారు చాలా సంతోషించినారు. కాబట్టి మరువక దేవుని సేవచేయుచు మన తెలివినియుపయోగపరచుచు, దేవుని సేవ చేయుటయెడల నాకు శ్రమయని గ్రహించి, మన మంచి క్రియలను యితరులకు చూపించి భక్తిగలవారమై యుండుటకు ప్రయత్నించుదము.

ఇట్లు మీ ప్రియ బాలమిత్రుడు,

దండాబత్తిలి దావీదు,

బెజవాడ.

C. L. S. PRESS, MADRAS—1916